యు, వాక్కుయొక్కయు, సభలయొక్కయు, రచనల యొక్కయు స్వాతంత్ర్యములో ఏమియు భంగముకలుగ రాదు. న్యాయస్థానములలో సక్రమమైన విచారణచేసి దోషిగా నిర్ణయింపబడినవానినే శిక్షించవలెను. ప్రతి భారతీయునికిని ఇంగ్లాండులోవలెనే లైసెన్సు క్రియ మిచ్చి ఆయుధములు పట్టుకొను అధికారముండవలెను. పత్రికలు స్వతంత్రముగానుండవలెను. వాటినుండి లైసెన్సు గాని, జమానతుగాని తీసికొనగూడదు.''

పై తీర్మానమును విశదీకరించుచు ౧౯౩౧వ సంవత్సరములో జరిగిన బొంబాయి కాంగ్రెసులో ఈక్రింది విధముగా తీర్మానము అంగీకరింపబడెను.

"స్వరాజ్యమనగా కాంగ్రెసువారిభావమేమో సామాన్య ప్రజలకు తెల్లముగా తెలియుటకై వారికర్థముగురీతిని కాంగ్రెసు వారి యభిప్రాయమును ప్రకటించుట యవసరము. సామాన్య జనులను దోచుకొను నిప్పటిపద్ధతి పోవలయునన్నచో రాజకీయ స్వాతంత్ర్యమునందు సామాన్యజనుల యార్థిక స్వాతంత్ర్యము గూడ జేరియుండవలెను, కావున కాంగ్రెసువారంగీకరింపదగిన ఏరాజ్యాంగము నందైనను నీక్రింది యంశము లుండవలయును.-లేదా నీయంశములను రాజ్యాంగములో జేర్చుటకు స్వరాజ్యప్రభుత్వమువారి కధికార ముండవలయును.

# ప్రధాన హక్కులు—విధులు

(౧) భారతదేశములో ప్రతిపౌరుడును తనయభిప్రాయములను స్వేచ్ఛగా ప్రకటించుటకును, యిష్టమువచ్చినవారితో గూడి ఇష్టమువచ్చిన సంఘమున జేరుటకును, న్యాయమునకు నీతికి విరుద్ధములుగాని పనులకొరకు నాయుధములులేకుండ నిష్టమువచ్చినట్లు సమావేశమగుటకును హక్కు గలిగి యున్నాడు.

(౨) ప్రతిపౌరుడును తనయంతరంగమునకు తానే యధికారియై తనమతమును తానే స్వేచ్ఛగా ప్రకటించి యాచరించుచు ప్రజా నీతికిని, శాంతికిని భంగములేనట్లు ప్రవర్తింప హక్కు కలిగియున్నాడు.

(౩) అల్పసంఖ్యాకుల విజ్ఞానము, భాష, లిపులును, నాయా భాషారాష్ట్రముల విజ్ఞానభాషా లిపులును సంరక్షింప బడవలయును.

(౪) పౌరులెల్లరును వర్ణ, మత, లింగభేదములు లేక న్యాయశాస్త్రమునకు సమానులే.

(౫) ఏ పౌరు లెట్టి ఉద్యోగమును సంపాదించుటకు గాని, యెట్టి యధికారమును బొందుటకుగాని, యెట్టివ్యాపారమును, నెట్టివృత్తిని అవలంభించుటకుగాని, వారి వర్ణ, మత లింగములనుబట్టి యెంతమాత్రమును నసర్హత పొందజాలరు.

(౬) ప్రభుత్వమువారిచేతగాని, స్థానిక ప్రభుత్వముచేతగాని సర్వజనోపయోగార్థమై వ్యక్తులొసగిన ధనముచేతగాని నిర్మింపబడిన బావులు, చెరువులు, రోడ్లు, పాఠశాలలు, ప్రజా విహారస్థలములు మున్నగువానికై పౌరులెల్లరకు సమానమగు హక్కులును, బాధ్యతలును కలవు.

(౭) ప్రతిపౌరునికిని శాసనానుసారముగ నాయుధములనుబట్టి తిరుగు హక్కుగలదు.

(౮) లా ప్రకారముగాక యేపౌరుని స్వాతంత్ర్యమునుగాని, వాని గృహమునుగాని, వానియాస్తినిగాని, యెవ్వరును ప్రవేశింపగూడదు, లాగుకొనగూడదు, వశముజేసుకొనగూడదు.

(౯) అన్నిమతముల విషయమునను ప్రభుత్వము తటస్థభావమును వహించును.

(౧౦) మైనారిటీవెళ్ళిన జనులెల్లరకును వోటుహక్కుండవలయును.

(౧౧) ప్రభుత్వమువారు దేశములోనంతటను నుచితముగనిర్బంధ ప్రాథమికవిద్యావిధానమును ప్రవేశపెట్టవలయును.

(౧౨) ప్రభుత్వము వారెవ్వరికిని బిరుదము లీయకూడదు.

(౧౩) మరణదండన ముండరాదు.

(౧౮) ప్రతి పౌరుడును భారతదేశమంతట యిష్ట ము వచ్చినట్లు ప్రయాణము చేయవచ్చును. ఇష్టమువచ్చినచోట ఆస్తిని సంపాదించుకొనవచ్చును.ఇష్టమువచ్చిన వ్యాపారమును. వృత్తిని నవలంభించవచ్చును. భారతదేశమందన్ని ప్రాంతములందును నేరారోపణ విషయమున సమానమైన హక్కులుపొంది సమానమైన రక్షణము లుండవలయును."

ఇట్లు కాంగ్రెసులో పలుమారుతీర్మానించినను ఇంకను ప్రజాస్వాత్వముల నంగీకరించు శాసనము గావింపబడలేదు. భారతీయులు ఇతర నాగరిక దేశములలో—అందునను ఇంగ్లాండులోని ఇంగ్లీషువారి కేవిధమగు ప్రజాధికారములున్నవో అవియే అడిగిరి. కాంగ్రెసువారు న్యాయశాఖనుండి కార్యనిర్వాహకశాఖను విడదీయవలెనని అనేక సంవత్సరములుగా కోరిరి.

పత్రికా శాసనము మొట్టమొదట ఇండియాలో క్రీ. శ. ౧౮౭౮లో గావింపబడెను. దానిప్రకారము మేజిస్ట్రేటు అనుమతిలేనిదె యెవ్వరును పత్రికను స్థాపించకూడదు. కాని ఆశాసనమంత కఠినముగా లేకుండెను. పత్రికలలో శక్తి విజృంభించినం గమనించి క్రీ. శ. ౧౯౧౦లో ఇండియన్ ప్రెస్ శాసనముగావింపబడెను. దానిప్రకారము ముద్రాపకులు ౫౦౦ రూపాయలకు తక్కువ కానట్టియు అధికారులు నిర్దేశించినట్టియు మొత్తమును జమానతుగా పెట్టిననేగాని పత్రికలకు సెలవీయబడదు. మరియు పై శాసనములో ౪వ సూత్రమున పత్రికలో రాజద్రోహ వ్యాసమేదైన ముద్రింపబడినట్లయిన ఆ నగదు జమానతు

సొంతము జప్తీ చేయబడుననియు, అట్టివ్యాసములుగల పత్రికలు గాని, పుస్తకములుగాని అన్నియు జప్తీచేయబడుననియు శాసింపబడెను.

సభల విషయమై బ్రిటిషుఇండియాలో ౧౯౦౭వ సంవత్సరము వరకు ఏ ప్రత్యేక శాసనములేకుండెను. ౧౯౦౭లో ఒక శాసనము చేసిరి. దానియుద్దేశ్యము శాసనమందే యిట్లున్నది: "రాజద్రోహమును వృద్ధిపరచునట్టివియును లేక ప్రజోపద్రవయుక్తములగు విషయములలో అల్లరులు కలిగించునట్టి బహిరంగ సభల విషయమై మేలైన నిరోధకపద్ధతులను నవలంభించుట'' అనునది ముఖ్యోద్దేశము. పై శాసనముయొక్క ౯వ సూత్రమునులో ఇట్లు శాసించిరి. "ఈశాసనము నేటినుండి 3 సంవత్సరముల వరకు వర్తించును'' తరువాత మరల ఈశాసనముగాని లేక అట్టి వేరుశాసనముగాని కావింపబడలేదు. అయినను ఫౌజ్దారీ శాసనములలోని సూత్రములను తమ సేవకొఱకు అధికారులు తీసుకొనిరి. మరియు క్రిమినల్ లా సవరణ శాసనము పేరుతో గావించినదానిలో అత్యంత కఠిన నిబంధనలుచేసిరి. అటుపూర్తిగా ప్రాథమిక స్వత్వములను ధ్వంసముచేసినట్టివి.

భారతదేశములోని ఆయుధనిషేధము ఒక ప్రత్యేక లక్షణము. ౧౮౫౭వ సంవత్సరములో భారతదేశమందు గొప్ప విప్లవము జరిగెను. దానినే మ్యూటినీ అందురు. ఆ మ్యూటినీలో కొంతకాలము ఇంగ్లీషువారికి ఈ దేశమున అస్తిత్వమే యుండదేమోయని అనిపించునట్లయ్యెను. తుదకు ఇంగ్లీషువారే

విజయమందిరి. అప్పటినుండియు భారతీయులను ఆయుధముల పట్టనిచ్చుట ప్రమాదకరమని ఆయుధశాసనమునుచేసి నిషేధించిరి. తత్ఫలితముగా హైందవులు క్రమక్రమముగా పిరికివారగు చున్నారని దేశీయనాయకులు కాంగ్రెసులో పలుమారులు ఆ శాసనమును రద్దుపరచుమని కోరిరి. కాని ఫలితము లేక పోయెను.

భారతదేశములో ప్రభుత్వోద్యోగముల సమస్య ప్రత్యేకత వహించునట్టిదే. ఇండియన్ సివిల్ సర్వీసులో బహుకాలమువరకు కేవలము ఇంగ్లీషువారే నియమితులగుచుండిరి. దానిని "ఉక్కు చట్టము" అని లాయిడ్ జార్జి ప్రధానమంత్రిగా నుండినప్పుడు వర్ణించి మెచ్చుకొనెను. ఉన్నతోద్యోగములందు విశేష భాగము ఇంగ్లీషువారేయుండిరి. ఈ పరిస్థితులను గమనించినచో గో॥ కృ॥ గోఖలేవంటి మితవాదికూడ తీవ్రముగా నాక్షేపించవలసివచ్చెను. "ఉన్నతోద్యోగములను కేవలము మొకవృత్తి కొరకు కోరుటలేదు. అధికార సంబంధమగు ఉద్యోగములన్నియు ఒకేజాతివారి కుత్తా అయిపోయినట్లయిన వాటినుండి దూరముగా నుంచబడినవారు ఎల్లప్పుడు తాము తక్కువదర్జాలో చేర్చబడితిమని మనోబాధను పొందుచుందురు. కావున ఈసమస్య జాతీయ గర్వమునకును ఆత్మగౌరవమునకు సంబంధించినది" అని గోఖలేగారు అభిప్రాయపడిరి.

౧౯౩౬లో "హైందవ పౌరస్వాతంత్ర్య సంఘము" స్థాపింపబడెను. దానికధ్యక్షులు రవీంద్రనాథ ఠాకూరుగారు.

కాంగ్రెసు అధ్యక్షులుగా నుండిన జవాహర్‌లాల్ నెహ్రూ గారే ఆ సంఘస్థాపనకు కారకులైరి.

౧౯౪౭లో ఇండియాకు స్వాతంత్ర్యమువచ్చెను. ౧౯౫౦ జనవరి ౨౬ తేదీనాడు భారత నూతనరాజ్యాంగము ప్రకటింపబడెను. అందు ప్రజాధికారములు స్పష్టముగా ప్రకటింపబడినవి. వాటినిగురించి కొంత తెలుసుకొందము.

# స్వతంత్ర భారత దేశమందలి

# ప్రజాధికారములు

పూర్వప్రకరణములో భారతదేశము ఇంగ్లీషు పరిపాలనములో పరాధీనమైయుండినప్పటి పరిస్థితులు తెలుపబడినవి. ఈప్రకరణములో స్వతంత్రభారతదేశమునందలి పౌరజనాధికారములను గురించి తెలుపబడును. కాంగ్రెసునాయకులే యిప్పుడు ప్రభుత్వమును నడిపించువారైనారు. వారు పరాధీనులుగా నుండునప్పుడు ప్రజలకష్టాలను స్వయముగాఅనుభవించి తెలుసుకొన్నవారు. కావున వారు భారతస్వతంత్ర రాజ్యాంగములో ప్రజాధికారాలనుగురించి మూడు ప్రకరణములను చేర్చినారు. నిరంకుశత్వమునుండి విముక్తి పొందిన ఫ్రాన్సుదేశములో "స్వాతంత్ర్యము, సమానత, భ్రాతృత్వము" అను నినాదములు ప్రచారమయ్యెననియు, సంయుక్త సంస్థాన అమెరికా (యు. యస్. ఏ) బ్రిటిష్షువారితో యుద్ధము చేసి గెలిచి స్వాతంత్ర్యము ప్రకటించిననాడు పౌరజనాధికారములకు ప్రప్రథమస్థాన మిచ్చిరనియు, యూరోపులోని స్విస్ దేశపు రాజ్యాంగము ఉత్తమోత్తమమైనదనియు పూర్వప్రకరణములో తెలుపనైనది. మన భారతప్రభుత్వానికి పై మూడుదేశాల రాజ్యాం

గము ఆదర్శమైనదయ్యెను. పుండుమానినను బెందు మాయుద న్నట్లుగా ఇంగ్లీషువారువెళ్ళిపోయినను వారిముద్ర మనరాజ్యాంగముపై పరిపాలన విధానముపై అట్లేనిలిచినది. అందుచేత ఇంగ్లండుదేశపు రాజ్యాంగవిధానముకూడ మనవారికి మార్గదర్శకమయ్యెను. ఇట్టివిధానముల అనుకరణములలో మనరాజ్యాంగ మొక రూపమొందినది.

౨౬ జనవరి మనకు బహుసంవత్సరాలనుండి రాజకీయ పుణ్యదినముగా నేర్పడినది. ఆనాడు ప్రతిసంవత్సరము కాంగ్రెసు వారందరును ఊరూర సభలుచేసి స్వాతంత్ర్య ప్రమాణమును స్వీకరించుచుండిరి. ౧౫ ఆగస్టు ౧౯౪౭లో ఇంగ్లీషువారు మనకు దేశమప్పగించి వెళ్ళిపోయినదినము ఆనాటినుండి భారత దేశపు శాసననిర్మాణసభ పార్లమెంటుగామారిపోయి స్వతంత్ర భారత రాజ్యాంగమును నిర్ణయించి ౨౬ నవంబరు ౧౯౪౯ నాడు ప్రకటించెను. ఆనాడు మనపార్లమెంటు ప్రతినిధులు ఈక్రింది విధముగా ప్రమాణమును స్వీకరించిరి.

"We, the people of India, having solemnly resolved to constitute India, into a Sovereign Democratic Republic and to secure to all its Citizens;

JUSTICE, social economic and Political,

LIBERTY, of thought; expression, belief, faith and worship;

EQUALITY of status and opportunity and to promote among them all;

FRATERNITY assuring the dignity of the individual and the unity of the nation;

In our Constituent Assembly this 26th day of November 1949, do hereby adopt, enact, and give to ourselves this constitution"

విషయ ప్రాముఖ్యమును బట్టి ఇంగ్లీషు మూలము నుదహరించి దానియర్థము నీక్రింద తెలుపనైనది.

"భారతీయ పౌరులమైన మేము ఇండియాను స్వతంత్ర ప్రజా వైరాజ్యము (రిపబ్లిక్)గా నిర్మించి దాని ప్రజలందరికిని ఈ క్రిందివి సమకూర్చుటకు నిశ్చయించినాము.

౧ సాంఘిక, ఆర్థిక, రాజకీయ న్యాయధర్మము.

౨ భావ, విశ్వాస, మత, పూజా స్వాతంత్ర్యము

౩ సమానస్థితి, సమానావకాశములు కలిగించి వాటిని అందరిలో పెంపొందించుట.

౪ భ్రాతృత్వము— వ్యక్తుల ఆత్మగౌరవము. జాతిలో ఐక్యత కలిగించుటకై విశ్వాసము కలిగించుట.

ఈ ౨౬ నవంబరు ౧౯౪౯ నాడు మా రాజ్యాంగ పరిషత్తులో మేమీ విషయములుకల ఈ రాజ్యాంగమును అంగీకరించి శాసించుచున్నాము."

మన స్వతంత్ర భారతరాజ్యాంగములోని రెండవ, మూడవ, నాల్గవ ప్రకరణములు పూర్తిగా ప్రజాధికారములకై ప్రత్యేకింపబడినవి. సూత్రము ౫ నుండి ౪౯ వరకు అనగా ౪౪ సూత్రములు (సెక్షనులు) వీటికొరకై ప్రత్యేకింప బడినవి. అవన్నియు మనము బాగుగా తెలుసుకొన దగినవే. అందుచేత వీటిలోని సారాంశమును ఇచ్చట తెలుపుచున్నాము.

౫వ సూత్రమునుండి ౧౧వ సూత్రమువరకు భారతదేశ పౌరులెవ్వరు అను విషయమును నిర్ణయించినారు. అది మన చర్చకంతగా ముఖ్యమైనది కాదు. ౧౪వ సూత్రమునుండి ౪౯వ సూత్రము వరకుండునవే మనకు చాలా ముఖ్యమైనవి.

సూత్రము ౧౪— న్యాయము అందరికీని సమానముగా వర్తించును.

సూ. ౧౫.— మతము, జాతి, కులము, లింగము, (స్త్రీ పురుష విచక్షణ)అను విషయాలలో ప్రభుత్వమేవిధమగు వ్యత్యాసమును ప్రకటించదు. మతము, జాతి, కులము, లింగము అను విచక్షణతో ఏపౌరునికీని దుకాణాలలో, హోటళ్ళలో, వినోదస్థలాలలో పౌరులకై వినియోగమగు బావులు, చెరువులు, స్నానఘట్టములు. రోడ్లు, పబ్లికుస్థలాలు, వీటిలోను ఆటంకము లుండనేరవు.

సూ. ౧౬— ఉద్యోగాలలో అందరికీని సమానావకాశములుండును. (వెనుకబడిన వర్గాలవారికి ప్రభుత్వము ప్రత్యేకావకాశములిచ్చు శాసనములు చేయగలదు)

సూ. ౧౭— (ఈసూత్రము చాలాముఖ్యమైనదని పాఠకులు గమనింతురు గాక)

“అంటరానితనము అన్నది తొలగింపబడినది. దాని నేరూపములోనైనను పాటించుట నిషిద్ధమైనది. అంటరాని తనమును పేరుతో ఏవిధమైన ఆంక్షలు పెట్టుట నేరముగా పరిగణింపబడి శాసనానుసారముగా దానిని పాటించువారికి శిక్షలు శావింపబడును.

సూ. ౧౮. సైనిక (మిలిటరీ) సారస్వత బిరుదములుతప్ప మరేబిరుదులను ప్రభుత్వ మెవ్వరికిని ఇయ్యదు. ఇండియాపౌరుడెవ్వడున్నూ విదేశములలో బిరుదులను పొందరాదు,

సూ. ౧౯. ప్రతి పౌరునికినీ ఈ క్రింది అధికారము లుండును.

౧ వాక్స్వాతంత్ర్యము, భావప్రకటన స్వాతంత్ర్యము.

౨ ఆయుధములు లేకుండా శాంతియుతముగా సమావేశమగుట

3 సంఘముల స్థాపించుకొనుట.

౪ ఇండియా అంతటను స్వేచ్ఛగా తిరుగుట.

౫ ఇండియాలో ఇష్టమున్న తావున నివసించుట.

౬ ఆస్తుల సంపాదించి వాటిని ఇష్టమువచ్చినట్లు వినియోగించుకొనుట.

౭ ఏ వృత్తినైనా వ్యాపారమునైనా సాగించుకొనుట వాక్స్వాతంత్ర్యము ఇతరులకు మాననష్టము కలిగించు రీతిగా నుండరాదు. మరియు ప్రభుత్వమునే ధ్వంసించునదిగా నుండ కూడదు,

సూ- ౨౦. వర్తమానశాసనముల ధిక్కరించి నేరములు చేసిన తప్ప నిష్కారణముగా ఎవ్వరికినీ శిక్షలుండవు. ఒకే తప్పునకు రెండుమారులుశిక్షలుండవు. నిందితుడు తనకే విరుద్ధముగా వాఙ్మూలమిచ్చుటకై నిర్బంధింపబడడు.

సూ- ౨౧. ఏవ్యక్తికికాని శాసనానుసారముగా తప్ప నిష్కారణముగా ప్రాణనష్టము ఆత్మస్వాతంత్ర్యనష్టము కలిగించుట లేదు.

సూ- ౨౨. నేరములో బంధితుడైన (అరెస్టు అయిన) వ్యక్తిని ౨౪ గంటలలో న్యాయాధికారివద్దకు తీసుకొనిపోయి అ ఆజ్ఞలేనిది అంతకు మించిన కాలము నిర్బంధములో నుంచరాదు.

సూ. ౨౩. జనులు కొనుట అమ్ముట, జనులతో బేగార్ వెట్టి, తీసుకొనుట, నేరములుగా పరిగణింప బడును!

సూ- ౨౪. ౧౪ ఏండ్లలోపలి వారినెవరినిగాని ఫ్యాక్టరీలలో, గనులలో, అపాయకరమగు పనులలో కూలీలనుగా తీసుకొనరాదు.

సూ. ౨౫: పౌరులందరికిని విశ్వాసస్వాతంత్ర్యముకలదు. అందరును తమతమ మతముల ప్రచారములో స్వీకారములో స్వేచ్ఛగా ఆచరించుకొనవచ్చును.

హిందువుల సాంఘికాభివృద్ధికై అన్నివర్గముల వారికి పబ్లిక్ పూజాస్థానములు ప్రవేశార్హములని శాసించుటకు ప్రభుత్వాని కధికారముండును.

సూ. ౨౬- ప్రతి మతానుయాయులును ధార్మిక-సంస్థలను స్థాపించుకొనవచ్చును. అందుకై చిరచరాస్తులను సంపాదించి వాటిని అనుభవింపవచ్చును.

సూ- ౨౭. ఏమతసంస్థగాని ఎవరినికూడా ఏలాటి పన్నులు ఇచ్చునట్లు బలవంతపెట్టరాదు.

సూ. ౨౮- ప్రభుత్వ ధనసహాయముపొందు ఏబళ్లలోను ఏవిధమగు మతబోధ చేయరాదు. ప్రభుత్వామమతి పొందిన ఏబడిలోను విద్యార్థులను ఏమతబోధనైనా పాల్గొన నిర్బంధించరాదు.

సూ- ౨౯. ప్రజలు తమ మాతృభాషల, తమ లిపులను వృద్ధిచేసుకొను అధికారము కలిగియుందురు. అందరికిని అన్నిబళ్ళలో ప్రవేశాధికారము కలదు. అల్పసంఖ్యాకులు తమ భాషాబోధనాలయములను స్థాపించుకొను అధికారము కలిగియుందురు. ప్రభుత్వము అన్నిభాషాసంస్థలకు సమానముగా సహాయము చేయును.

సూ- ౩౧. ఎవ్వరిఆస్తిని కాని న్యాయవిరుద్ధముగా ఎవరును లాగుకొనజాలరు. సరియైన ప్రతిఫలమిచ్చి ప్రభుత్వము అవసరమగు ఆస్తులను స్వాధీనపరుచుకొనవచ్చును.

సూ- ౩౨. పై ప్రజాధికారములను స్థాపించుకొనుటకు ప్రజలు సుప్రీంకోర్టులో వ్యవహరించు అధికారము కలిగియున్నారు.

సూ.౩౯— అందరికీని తగిన జీవితావకాశములను ప్రభుత్వము కల్పించుటకై కృషిచేయును. స్త్రీపురుషులకు సమానముగు ప్రతిఫలము లభింపజేయబడును. పరిశ్రమలలో కార్మికుల యొక్కయు, శిశువులయొక్క ఆరోగ్యమునకు భంగము కలుగకుండా ప్రభుత్వము విచారించుకొనును.

సూ.౪౦— స్వపరిపాలనాంగములుగా పనిచేయు గ్రామ పంచాయతులు స్థాపింపబడును.

సూ.౪౩— శ్రమజీవులకు సరియగుకూలీ లభించునట్లు చేసి ముఖ్యముగా కుటీరపరిశ్రమలకు ప్రభుత్వము తోడ్పడును.

సూ.౪౫— పదేండ్లలోపుగా దేశమంతటను ౧౪ ఏండ్ల లోపలి బాలబాలికలకు ఉచిత నిర్బంధవిద్యను ప్రభుత్వమిప్పించును.

సూ.౪౭— ప్రజారోగ్యమునకై ప్రభుత్వము పాటుపడి మద్యముల నిషేధించును.

సూ.౪౮— పశువుల వృద్ధికి పాడివృద్ధికి తోడ్పడి అట్టి పశువుల వధల నిషేధించును.

సూ.౪౯— చారిత్రిక కళాస్థానములను ప్రభుత్వము రక్షించును.

సూ.౫౦— అంతర్జాతీయ శాంతిక్షేమములకై ప్రభుత్వము పాటుపడును.

అంతర్జాతీయ న్యాయమునకు దోహదమిచ్చి అంతర్జాతీయ వివాదములను మధ్యవర్తులద్వారా పరిష్కరించుటకై ప్రభుత్వము పాటుపడును.

ఇవి మన నూతనరాజ్యాంగములోని ముఖ్యవిషయములు. వివరణాభిలాషులు మూలమును చదువుకొనవలసియుండును. పై సూత్రములలోని విషయములవల్ల మనదేశమందు పౌరులకు సమానత, స్వేచ్ఛ, వ్యక్తిస్వాతంత్ర్యము. మతస్వాతంత్ర్యము, సాంస్కృతిక సంరక్షణము, విద్యాసౌకర్యములు, ఆస్తిస్వాతంత్ర్యము, సౌభ్రాతృత్వము ప్రజాధికారభంగములు కలిగిన న్యాయస్థానములద్వారా వాటిని స్థిరపరుచుకొనుట, ఆరోగ్యరక్షణము—ఇవన్నియు సంక్రమించినవన్నమాట. ఇందు ౧౭వ సూత్రము ముఖ్యాతి ముఖ్యమైనది, ఇంచుమించు ౨౫౦౦ ఏండ్లనుండి హిందూమత వృక్షమునకు వేరుపురుగై, హిందూమతమునకు అత్యంత కళంక కారణమై, లజ్జాకరమై, అమానుషమై, అతిహేయమైన అస్పృశ్యతాఘోరాచారము ౧౭వ సూత్రముతో - ఒకేఒక దెబ్బతో విధ్వస్తమైనది. ఇకముందెవ్వరును ఇతరులను అంటరానివారినిగా పరిగణించిన అట్టి అపరాధముచేసినవారికి జెయిలుశిక్షయే లభించితీరును! మన ప్రజాధికారాలలో

అమెరికావంటి దేశములందలి రాజకీయవేత్త లత్యంతముగా ప్రశంసించినదీ ౧౭వ సూత్రమునే! మన రాజ్యాంగములో ప్రజాధికారము లత్యంత విపులముగా నిరూపితమైనవి. మనము వాటిని సభ్యతతో వినియోగించికొనిన దేశమునకు గౌరవము ప్రతిష్ఠ అభివృద్ధికలిగించి ప్రపంచజాతులలో బహుశా మనము అగ్రస్థాన మలంకరించగలము.

హైద్రాబాదు రాష్ట్రములోని

# ప్రజాధికారములు

పోలీసుచర్యకు పూర్వపుస్థితి:—

భారత దేశమందలి విచిత్రములలో దేశీయ సంస్థానములలోని పరిస్థితులుకూడ చేరదగినట్టివి. సుమారు ౫౬౦ సంస్థానములు దేశీయప్రభువుల ఏలుబడిలో నున్నవి. ఇంచుమించు అన్ని సంస్థానములును చాలవెనుకబడి యున్నవి. అనేక సంస్థానములలోని అత్యాచారములు, అన్యాయములు, ఏలికల మితిమీరిన వ్యయములు. నిరంకుశ చర్యలు, వీటిని గురించి ఇంగ్లాండు పత్రికలకుగూడ అరేబియన్ రాత్రికథలవలె గాన్పించుచున్నవి.

కొన్ని సంవత్సరములనుండి దేశీయసంస్థాన ప్రజలు ఏకమై సభలను జేసికొనిరి. ౧౯౩౬ లో, కరాచీనగరమున డాక్టరు పట్టాభిసీతారామయ్యగారి అధ్యక్షతలో అయిదవ దేశీయ సంస్థానప్రజలసభ జరిగెను. డా॥పట్టాభిగారి అధ్యక్షోపన్యాసము నుండి కొన్ని భాగములుదహరించిన దేశీయ సంస్థానములలోని ప్రజల స్థితిగతులు తెలయగలవు.

“సంస్థానప్రజల మహాసభవారగు మీరు నవనగరు యొక్క జాం సాహెబుగారి నిరంకుశత్వమును బయలు పెట్టితిరి. జోధపూరు, గోండల్, ఆల్వార్, బికానీరు సంస్థానములలోని అత్యాచారముల బయలు పరచితిరి. ముఖ్యముగా పటియాలా మహారాజుగారిపై నేరములను మోపితిరి. శిరోహీ మహారాజుగారు చేసిన స్త్రీ బలవద్గమనముల, న్యాయరహితమగు నిర్బంధములను బహిరంగముగా విచారించుమని మీరు కోరితిరి. దేశీయ సంస్థానము లందలి వెట్టిచాకిరీని బయలు పెట్టితిరి.” “లహారూ సంస్థానములో తిరుగబడిన ప్రజల యిండ్లలో బడి నవాబుగారి భటులు లూటీచేసిరి. దేవాలయమును అపవిత్రము చేసిరి. స్త్రీలను చెరిచిరి.”

“భారతదేశమందు సంస్థాన ప్రజల సమస్య గందరగోళములో కూడినది. నిజాముగారు ౧౮౦ లక్షల మందిపై రాజ్యము చేయుచున్నారు. అందు ౧౫౦ లక్షల హిందువులు. అట్లుండినను ఉర్దూభాషయే రాజ్యభాషయు, బోధనాభాషయునై యున్నది. భూపాల్ నవాబుగారు ౭ లక్షల మందిపై రాజ్యము చేయుచున్నారు. అందు నూటికి ౧౧ గురే ముసల్మానులు. అచ్చటను రాజభాషయు విద్యయు ఉర్దూలో జరుగుచున్నది. కాశ్మీరురాజు హిందువు. ప్రజలు ముసల్మానులు. వారు వ్యవసాయకష్టములు భరింపలేక అల్లరులు చేసిరి.

............ఈ దేశీయరాజ్యములు ఒక అధోలోకము గా నున్నవి.

ఇవి భారతదేశ నాయకుల దృష్టిలో దేశీయసంస్థానము లందలి పరిస్థితులను గురించిన భావములు.

దేశీయ సంస్థానము లన్నింటిలో గొప్పది హాయిదరా బాదురాష్ట్రము. ఈరాష్ట్రములోని ప్రజాస్వాతంత్ర్యములను గురించి ఉన్నత న్యాయస్థానములో న్యాయమూర్తిగా నుండిన ఆర్. యస్. నాయకు ఎం. ఏ. బారిస్టరుగారు ౧౯౩౧ వ సంవత్సరములో బీరారులో చేరిన అకోలా నగరములో హాయిదరా బాదు రాజకీయ మహాసభయొక్క అధ్యక్షపదవి నలంకరించి తమ అధ్యక్షోపన్యాసములో సెలవిచ్చిన కొన్నిభాగము లుదహరింపబడు చున్నవి.

"మనమెన్నియో సభలనుగురించి వినినాము. కాని యీసభా వృత్తాంతము అపూర్వమైనట్టిది. హాయిదరా బాదు ప్రజలను తమరాష్ట్రములోనే తమభావములను వెల్లడింప నీయనందున మేమురాష్ట్రము వెలుపలికి రావలసి వచ్చెను.

"హైద్రాబాదులో పోలీసుగష్తీ (౨౩) కలిగించినట్టి అసంతృప్తిని మరేవిషయముకూడ కలిగించలేదు.

"విద్యావిషయములో అధికసంఖ్యాకుల భాషకానట్టి ఉర్దూద్వారా విద్యనేర్పించు పరిశోధనపై గొప్ప గా వ్యయమగుచున్నది. ..........పైగా ఖాస్గీబళ్ళ

నిషేధము విద్యావ్యాపకములో గొప్పనిరోధకారి.
"హైదరాబాదులో కొన్ని పత్రికలను ప్రభుత్వము సహాయముచేయుచున్నదని ఆక్షేపణ కలదు. బ్రిటిషిండియాలో పత్రికలస్థితి చెడ్డగానేయున్నది. హైదరాబాదులో అంతకన్న అధ్వాన్నముగా నున్నది. ఏమియు కారణము చూపకుండా పత్రికలను క్షణమాత్రములో బందు చేయుచున్నారు."

నిజాం ప్రభుత్వము ౧౯౨౨ నుండి తమరాష్ట్రము ఆర్థికాభివృద్ధికై అనేక శాసనముల గావించిరి. వ్యవసాయాభివృద్ధికై చెరువులు కాలువలు కట్టించినారు. ఆర్థికమాంద్యము కలిగినప్పుడును క్షామపరిస్థితు లేర్పడినప్పుడును పన్నులలో తగ్గింపులు చేసిరి. విద్యాభివృద్ధికై ద్రవ్యము బాగుగానే వ్యయము చేసిరి. హాయిదరాబాదు నగరమును కోట్లద్రవ్యమును వ్యయము చేసి నందన వనముగా మార్చిరి. జిల్లా ప్రధాన స్థలములలో నీటి వసతులు, రోడ్లు, వెలుతురు, మున్నగు సౌకర్యములు వృద్ధిచేసిరి. ఇట్లు వారుచేయునట్టి సత్కార్యములను ప్రశంసించుచు మనకిప్పుడు సంబంధించినట్టి పార్థివాయి స్వాత్వములను గురించి చెప్పవలసినప్పుడు ఈ విషయములో ఏమియు చేయలేదనవలెను. ఇక నిజాంరాష్ట్రములో వివిధ పార్థివమిక స్వాత్వము లేవిధముగా లేవో సంగ్రహముగా తెలిసికొందము.

# వాక్స్వాతంత్ర్యము

దుర్యశముపొందిన గస్తీ ౫౩ సర్వజనవిదితమే దానిలో నిజాంప్రభుత్వమువారు కొద్ది సవరణలు తర్వాతచేసిరి. తదనుసారముగా సభలు రెండు విధములు

(౧) విద్యాధార్మికములు. సాంఘికములు, సారస్వతములు.

(౨) మతము, రాజకీయములు, మొదటివర్గములో చేరని అన్ని విషయములను.

మొదటితరగతి సభలకు అనుమతి అవసరములేదు. కాని అధికారులకు ముందుగా అట్టి సభలు చేయుచున్నామని మాత్రము తెలుపవలెను. రెండవతరగతి సభలకు పూర్వము వలెనే అనగా జిల్లా తాలూక్దారుగారికిని నగర కోత్వాలుగారికిని ౧౦ దినములు ముందుగా తెలుపవలెను. అనుమతి పొందవలెను. అనుమతిలేనిది చేయరాదు. ఈక్రొత్త గస్తీని చేయుటలో ప్రభుత్వమువారి యుద్దేశము అర్థముకాదు. ఇది మునుపటిగస్తీకన్న కఠినముగానున్నది. ఈనూతన నిర్బంధకశాసనము రాష్ట్రప్రజలకు మరింత ఘోరాకారముతో కష్టములు కలిగించున్నది. "సభ" యొక్క వర్ణనకూడ అతి సంకుచితముగా నున్నది. కొన్ని సమయములలో విందులు. కార్యనిర్వాహకసభలు, శ్మశానములుకూడ సభలుగా పరిణమించు నిర్వచనము మంచి విశాల నియమములతో కావించియున్నారు.

# ఉత్సవములు

దసరా మొహర్రములు ఒకేకాలములో వచ్చుగతి పట్టిన దసరా ఉత్సవములు చప్పుడు లేకుండా చేసికొనవలెను. నిశ్శబ్దముగా సీమోల్లంఘనము చేసికొనవలెను. జండాయెత్తిన అది ౧౫ మొహర్రమునాడే యెత్తవలెను. (చూడుడు గష్తీ. 3, తేది ౧3 ఆబాణ్ ౧౩౨౬ ఫ.)

కొంతకాలము అపుడలలోనుండి మరల రెండవసూరా మతో త్సవము చేయదలచిన మతశాఖవారి అనుమతిలేంది చేయ గూడదు, చూ. గష్తీ ౪స౦॥ ౧౩౨౯ ఫ.

మసీదులముందు వాద్యములు మ్రోయించకూడదు (గష్తీ 3 సంవత్సరము ౧౨౬౫ ఫ.) మసీదుకు ౩౦౦ గజ. ముల లోపల వాద్యములు కూడదు. (మతశాఖ గష్తీ ౪౧౪ తా॥ ౨౮ ఆజుర్ ౧౩౧౦ ఫ.) ముసల్మాను లెక్కువగా నుండుచోట ప్రాతదేవళములు, మఠములు బాగు చేయకూడదు. మార్పులు చేయకూడదు. (మతశాఖాజ్ఞ ౧౯-౧౦-౧౩౦౮ ఫ. మరియు మసీదులముందు బాజా భజంత్రీలు వాయించు విషయములో ఈ క్రింది నియమాలు చేసిరి. చూడుడు. ౨౨-౩-౪౪ ఫ. తేదిన చేయబడిన మతశాఖవారి నియమాలు)

(౧) మసీదులవద్ద రెండుదిక్కుల ఒకొక్కదిక్కున ౧౦౦ అడుగుల దూరమునుండియే వాద్యధ్వనులుచేయుట మానుకొన వలెను.

(౨) మసీదునుండి, కొలతవేయుటలో దాని ఆవరణము నుండి లెక్కపెట్టవలయును.

(౩) ౧౦౦ అడుగుల లోపల మసీదువద్దఉండే ఇండ్లలోను దేవాలయములలోను ముసల్మానులు చేయునట్టి ౫ మారుల నమాజుకాలములలో వాద్యధ్వనులు చేయకూడదు. అట్టి సమయములలో "జయ" కారములున్ను చప్పట్లున్ను మరి యేలాటి ఆటంకములు కలిగించు ధ్వనులున్ను చేయగూడదు.

(౪) ఈ నియమాలకు విరుద్ధముగా నడుచువారికి ౧ నెల జైలుశిక్ష లేక ౨౦౦ రూపాయలవరకు జుర్మానా లేక రెండున్ను విధింపబడును.

(౫) ఈసంబంధములో పూర్వము కావింపబడిన నియమాలు రద్దుపరచి యీ నియమావళియే అమలుగా నుంచబడినది.

## పత్రికలు

పత్రికలకు సాధారణముగా అనుజ్ఞ ఇయ్యబడదు. పత్రిక నడుపువాడు అనుమతికోరిన, వాని గుణ విశేషములు, వాడు ముల్కీఎ"డా" కాడా, వానికి పత్రికనడుపు శక్తి యున్నదాలేదా అను విషయములను విచారింతురు. సాధారణముగా అనుమతి నిరాకరింతురు. అనుమతి పొందినవారు రాజకీయములను గురించి ఏమియు వ్రాయమనియు ఇతర మతములను మతస్థులను దూషించుచు లేక అవమానపరచుచు వ్రాయ

ననియు ఒప్పుదలపత్రము వ్రాసి యియ్యవలెను. ఈ ఒప్పుదలకు విరుద్ధముగా నడిచినపత్రిక ఆపివేయబడును. ఇటీవల నగదు జమానతు తీసికొని క్రొత్తఆచారము ప్రారంభించినారు.

## వెట్టి

నిజాంప్రభుత్వమువారు తమరాష్ట్రములో వెట్టిచాకిరీ విశేషముగా నుండుటను గమనించి అనేకసంవత్సరములకు పూర్వమే అనేక గష్తీలు, ఫర్మానులు, కావించియున్నారు. అట్లుచేసినను జిల్లాలలో నేటికిని అధికారులు కొందరు వెట్టి చాకిరీ చేయించుకొనుచున్నారు, వెట్టిచేసినవారికి ప్రతిఫల మియ్యరనియు అనేకసభలలో చాలామారులు తీర్మానములు చేసినారు. వెట్టి ఒక్కహరిజనులనుండియే తీసుకొనరు. రైతులు ఎడ్లబండ్లను అధికారులు వచ్చినప్పుడు వంతులు గొట్టు ఆచారము కనబడుచున్నది. మరియు కోమట్ల దుకాణములనుండి కొందరు అధికారులు చిట్టీలుపంపి తమ భోజనసామగ్రిని, తమ గుర్రముల దాణాను తెప్పించుకొని పైకమియ్యక యెగ బెట్టుటయో లేక ఇచ్చునంతటి పుణ్యముకట్టుకొనున ఎడల నామ మాత్ర క్రియమో యిచ్చుటయో పలుమారులు వినుచున్నాము.

ఇట్టి అక్రమచర్యలు కేవలము ఉద్యోగ ధర్మమునకు విరుద్ధముగా నాచరించు అధికారులదే కాని ప్రభుత్వాజ్ఞ లేందును అట్లుచేయుటకు అనుమతింపనిమాటఅటుండ ప్రభుత్వము

వారి దృష్టికిట్టి దౌర్జన్యములు వచ్చినప్పుడెల్లను సరియగు విచారణలు చేయుచువచ్చినారని చెప్పవలెను.

## ఆత్రస్వాతంత్ర్యము

నిజాం ప్రభుత్వమువారికి సర్వాధికారములున్నవి. కేవలము న్యాయశాస్త్రబద్ధమైన అధికారములేకాక ఇతరాధికారములును వారికి కలవు. వారు బయటనుండివచ్చు పత్రికలను లోపలికి రానీయకుండ నిషేధింపగలరు. మానములోపలనే సుమారు ౨౫ పత్రికలను లోపలికి రానీయకుండ నిషేధించినారు. మరియు బయటివారిని అవసరమని తోచిన రాష్ట్రములో రాకుండునట్లుగా నిరోధించగలరు. లోపలివారిని అవసరమనితోచిన రాష్ట్రము వెలుపలికి (షేర్ బదర్ చేసి) పంపవచ్చును. లేదా ఒక ప్రత్యేక స్థానములోనే యుండునట్లు (నజర్ బందు) చేయవచ్చును. మరియు మున్ననూరు అను మహబూబునగరము జిల్లాలోని ఉన్నత శీతల ప్రదేశమునకు విచారణలు చేయకయే పంపవచ్చును. ఇట్టి ఆజ్ఞలు బాబె హుకూమతువారు మ. ఘ. వ. నిజాంప్రభువుగారికి తెలిపి చేయుదురు. లేదా శ్రీ ప్రభువుగారే ఫర్మానుద్వారా శ్రీముఖమియ్యవచ్చును.

# న్యాయస్థానములు

హైద్రాబాదు ఉన్నతన్యాయస్థానము ఫర్మానుద్వారా అధికారము పొందినట్టిది. బ్రిటిషిండియాలో కావింపబడని మార్పు ఈ రాష్ట్రములో జరిగినది. న్యాయశాఖను కార్య నిర్వాహకశాఖనుండి వేరుచేసినారు. ఉన్నతన్యాయస్థానమందు తీర్పులును స్వతంత్రమైనవి. బ్రిటిషిండియాలోనందు ఆచార మొకటిమాత్ర మింకను ఇచ్చుట వర్తించుటలేదు. న్యాయస్థా నములలో సాక్ష్యములు. వాజ్మూలములు, సమనులు,దావాలు అన్నియు ఉర్దూలో జరుగుచున్నవి. దేశభాషలలో బ్రిటిషిం డియాలోవలె యివన్నియు నుండవలెనని ప్రజలు బహుకాల మునుండి ఆందోళనము చేయుచున్నారు. వాక్స్వాతంత్ర్య విష యములో ౧౩౩౭ ఫసలీలో నొకతీర్పు హైకోర్టులో జరిగెను. సూర్యాపేటలో నొకసభకు నిరోధము కల్పింపగా నొక అభి యోగము ఉన్నతన్యాయస్థానములో తేబడెను. అందుఇప్పుడు న్యాయమూర్తిగా నుండునట్టి నవాబు అస్గరుయార్జంగ్ బహా ద్దరుగారు వకీలుగా పనిచేసిరి. ఆకేసు వివరములు దక్కనులా రిపోర్టులో సంపుటము ౧౭పుట ౨౧౯ లో (శేషాద్రి బనాం సర్కారెఆలీ) అను కేసులో ముద్రితమైనవి. నల్లగొండలో ఒక గ్రంథాలయ వార్షికోత్సవము చేయదలచి తన్నిర్వాహకులు కేవలము విజ్ఞాన విషయములను గురించే ఉపన్యాసములు జరు గుననియు ఆసభకు సెలవియ్యవలెననియు తాలూక్దారువద్ద

దరఖాస్తు పెట్టిరి. అందుపై తాలూక్దారు తనకే గస్తీ ౫౩ ప్రకారము సెలవిచ్చు అధికారముండియు జిల్లాన్యాయస్థానాధికారి (నాజిం) సెలవుపొందమని ఆజ్ఞాపించెను.

జిల్లా నాజిముగారు పోలీసువారి అభిప్రాయము కోరిరి పోలీసువారు ఉపన్యాసములు బహుశా రాజకీయపరిణామము పొందునేమోఅని ఉపన్యాసకుల పేరులనుబట్టి వారిచర్యలను బట్టి ఊహించుకొని తమఅభిప్రాయము తెలిపిరి. అందుపై నాజిముగారును ఏమియు తేల్చక బాబెహుకూమతు సెలవు పొందుమని ఆజ్ఞాపించిరి. మరల నాజింగారి కోరిక ప్రకారము సభలు జరుగబోవు కార్యక్రమ వివరములు తెలుపు చుదరఖాస్తు ఇచ్చిరి. అదియు త్రోసివేయబడెను, అందుపై హైకోర్టులో నిగరానీ చేయబడెను. హైకోర్టున్యాయమూర్తు లిద్దరు విషయము లన్నియు విని యిట్లు తీర్పుచెప్పిరి.

“ఫర్మానులోని రాజకీయములకై ఏర్పడిన బంధములను రాజకీయేతర సభలకు వినియోగించకూడదు.

“ఉపన్యాసములు కాకముందే ఒకసభ రాజకీయ సభయా కాదా అను విషయమును నిర్ణయించుట యెల్లప్పటికిని కష్టమే. ఎవ్వరు ఫర్మానుకు విరుద్ధముగా నడుతురో వారిచర్య న్యాయవిరుద్ధమైనదగును. అప్పుడు న్యాయాధికారి విచారించి నేరముస్థిరపడిన శిక్షింపవచ్చును. కాని ముందుముందుగానే న్యాయాధికారి

జోక్యము కలిగించుకొనుటకు అధికారము లేనివాడై యున్నాడు."

ఈ తీర్పు చాల ముఖ్యమైనట్టిది. వాజ్ఞిరోధవిషయమున మొత్తము హైదరాబాదు న్యాయస్థాన చరిత్రలో ఇదొక్కటే తీర్పే మనకు కనబడుచున్నది. కాని యీతీర్పుఅయిన తర్వాతకూడ నేటివరకు ప్రతిసభకును ఏదోవిధమగు అడ్డంకులు కలుగుచు వచ్చుటనుజూడ న్యాయస్థానముకన్న కార్యనిర్వాహక శాఖయే చాలబలీయమైనదని స్పష్టమగుచున్నది.

## వ్యాయామములు

హోం సెక్రెటరీ కచ్చేరినుండి ౨౫ ఖుర్దాదు ౧౩౪౮ ఫసలీలో అఖాడాల (వ్యాయామశాలల విషయమై) యీక్రింది విధముగా ఆజ్ఞలు కావింపబడెను.

౧ వ్యాయామ శాలను స్థాపించువారు దాని యుద్దేశము, దానిలో వ్యాయామము చేయువారి పేరులు, సభ్యుల పేరులు, నౌకరుల పేరులు మున్నగు వివరణలు వ్రాసి జిల్లాలో తాలూక్దారువద్దను నగరములో కొత్వాలు వద్దను దరఖాస్తు పెట్టవలెను. పై అధికారుల విచారించి ఆక్షేపణీయాంశములు లేకున్నను సెలవియ్యగలరు.

౨ వ్యాయామస్థలమును మార్చినట్లయినను ఒకవారములో ఆవిషయమును అధికారికి తెలుపవలెను.

(3) అధికారులు ఈవ్యాయామశాలలు కేవలము వ్యాయామమువరకు మాత్రమే యుండునట్లున్ను ఏవిధమైన రాజకీయవ్యవ [illegible] ప్రస్తి అందులో లేనట్లున్ను విచారించు కొనుచుండగలరు.

౪. అప్పుడప్పుడు అధికారులు వ్యాయామశాలల తనిఖీ చేయుచుండవలెను.

౫. రాజకీయములైనను లేక వ్యాయామములు కానట్టి విషయములనైనను యుండిన అట్టి వ్యాయామశాలలను మూసివేయవలెను.

ఇవి వ్యాయామశాలల నియమావళిలోని ముఖ్యాంశములు.

ఈ నియమావళి యనంతరము హైదరాబాదునగరము లోను ఇతరప్రాంతములలోను చాలా వ్యాయామశాలలు మూసివేయబడెను.

# విద్య

౧౩౩౪ ఫసలీలో ఖాన్గీ (ప్రైవేటు) పాఠశాలలను గురించి విద్యాశాఖవారు ఒక నియమావళిని ప్రవేశపెట్టిరి. అందలి ముఖ్యవిషయము లిట్లున్నవి.

(౧) ౧౫ విద్యార్థులకన్న ఎక్కువమందికలిగిన పాఠశాలలు అవి ప్రభుత్వమువారి సహాయముపొందినట్టివైన ఖాన్గీ పాఠశాల లనబడును.

జోక్యము కలిగించుకొనుటకు అధికారము లేనివాడై యున్నాడు."

ఈ తీర్పు చాల ముఖ్యమైనట్టిది. వాజ్మీరోధవిషయమున మొత్తము హైదరాబాదు న్యాయస్థాన చరిత్రలో ఇదొక్కటే తీర్పే మనకు కనబడుచున్నది. కాని యీతీర్పుఅయిన తర్వాతకూడ నేటివరకు ప్రతిసభకును ఏదోవిధమగు అడ్డంకులు కలుగుచు వచ్చుటనుజూడ న్యాయస్థానముకన్న కార్యనిర్వాహక శాఖయే చాలబలీయమైనదని స్పష్టమగుచున్నది.

## వ్యాయామములు

హోం సెక్రెటరీ కచ్చేరినుండి ౨౯ ఖుర్దాదు ౧౩౪౪ ఫసలీలో అఖాడాల (వ్యాయామశాలల విషయమై) యీక్రింది విధముగా ఆజ్ఞలు కావింపబడెను.

౧ వ్యాయామ శాలను స్థాపించువారు దాని యుద్దేశము, దానిలో వ్యాయామము చేయువారి పేరులు, సభ్యుల పేరులు, నౌకరుల పేరులు మున్నగు వివరణలు వ్రాసి జిల్లాలో తాలూకాదారువద్దను నగరములో కొత్వాలు వద్దను దరఖాస్తు పెట్టవలెను. పై అధికారుల విచారించి ఆక్షేపణీయాంశములు లేకున్నను సెలవియ్యగలరు.

౨ వ్యాయామస్థలమును మార్చినట్లయినను ఒకవారములో ఆవిషయమును అధికారికి తెలుపవలెను.

(3) అధికారులు ఈవ్యాయామశాలలు కేవలము వ్యాయామమువరకు మాత్రిమెయుండునట్లున్న ఏవిధమైన రాజకీయవ్యవ ప్రవృత్తి అందులో లేనట్టున్న విచారించుకొనుచుండగలరు.

౪. అప్పుడప్పుడు అధికారులు వ్యాయామశాలల తనిఖీ చేయుచుండవలెను.

౫. రాజకీయములైనను శకవ్యాయామములు కానట్టి విషయములనైనను యుండిన అట్టి వ్యాయామశాలలను మూసివేయవలెను.

ఇవి వ్యాయామశాలల నియమావళిలోని ముఖ్యాంశములు.

ఈ నియమావళి యనంతరము హైదరాబాదునగరము లోను ఇతరప్రాంతములలోను చాలా వ్యాయామశాలలు మూసి వేయబడెను.

# విద్య

౧౩౩౮ ఫసలీలో ఖాన్గీ (ప్రైవేటు) పాఠశాలలను గురించి విద్యాశాఖవారు ఒక నియమావళిని ప్రవేశపెట్టిరి. అందలి ముఖ్యవిషయము లిట్లున్నవి.

(౧) ౧౫ విద్యార్థులకన్న ఎక్కువమందికలిగిన పాఠశాలలు అవి ప్రభుత్వమువారి సహాయముపొందినట్టివైన ఖాన్గీ పాఠశాల లనబడును.

(౨) ప్రైమరీ పాఠశాలలికముందు జిల్లాడివిజనల్ ఇన్స్పెక్టరు సెలవులేనిది స్థాపించకూడదు. మాధ్యమిక పాఠశాలలను ఉన్నతపాఠశాలలను స్థాపించవలెనన్న విద్యాశాఖాధికారిసెలవు పొందవలసియుండును.

(౩) ఖాస్గీపాఠశాలలలో అన్నిమతములవారికిని చేరుటకు సమానాధికారము కలదు.

(౪) ఇతరమతములవారికి బాధకలిగించు మతబోధ ఖాస్గీబళ్ళలో చేయగూడదు.

(౫) ప్రభువుగారియెడను లేక ప్రభుత్వమునెడను విముఖత్వమును కలిగించు రాజకీయపు లేక రాజకీయేతరపు విద్యను బోధించగూడదు.

[౬] ఎచ్చటనైన సెలవులేనిది ఖాస్గీపాఠశాల స్థాపింపబడిన జిల్లా తాలూక్దారుద్వారా లేక నగర కొత్వాలుద్వారా ఆపాఠశాలలు మూసివేయించబడును.

[౭] అధికారులు ఖాస్గీబళ్ళకు సెలవియ్యవచ్చును. లేదా కారణములు చూపి నిరాకరించ వచ్చును.

ఈనియమావళిఫలితముగా ఖాస్గీపాఠశాలల సంఖ్యయు అందలి విద్యార్థులసంఖ్యయు తగ్గిపోయినది. ఎట్లనగా;

ఈనియమావళికిపూర్వము ౧౩౩౭ ఫసలీలో

ఖాస్గీ బళ్ళు ౪౧౫౩ విద్యార్థులు ౭౬౯౫౪

ఈనియమావళికి అనంతరము ౧౩౪౫ ఫసలీలోని విద్యాశాఖవారి నివేదిక ప్రకారముగా

| ఖాస్గీబళ్ళు | విద్యార్థులు |
| --- | --- |
| ౯౨౯ | ౨౫౮౬౫. |

అనగా ఊరపిచ్చుకమీద బ్రహ్మాస్త్రము పడినదన్నమాట. ౧౩౩౪ ఫసలీనుండి ౧౩౪౬వరకు—ఈ ౧౩సంవత్సరములనుండియు ప్రజలు,అనేకసభలుచేసి ఈవిద్యానిరోధక నియమావళిని రద్దుచేయుటకై ప్రభుత్వమువారిని ప్రార్థించిరి. కాని యేమియు ఫలితములేకపోయినది.

# ప్రజాసంరక్షణము

పరిస్థితులిట్లుండగా కొన్ని దినములక్రిందటనే ప్రజాశాంతి సంరక్షక శాసనము అనుపేరనొక కఠినశాసనమును [బాబె హాఃకుమతు] కార్యనిర్వాహకవర్గమువారు కావించియున్నారు. శాసనము పేరుమాత్రము ముద్దుగానున్నది. కాని అందలి విషయములు భయంకరముగానున్నవి. బ్రిటిషిండియాలో అసహాయోద్యమమును అణచివేయుటకై క్రిమినల్ లా ఆమెండుమెంట్ శాసనము కావింపబడియుండెను. అందునను పంజాబుయొక్కయు, మద్రాసుయొక్కయు శాసనములు అతికఠినముగా నుండునవి. ఆశాసనములోని విషయములన్నియు సంగ్రహించి మనరాష్ట్రములో పై శాసనము కావింపబడినది. ఇక

ముందు బయటివారు లోపలికివచ్చి రాష్ట్ర వ్యవహారములలో జోక్యము కలిగించుకొనగూడదు. ౧౫ ఏండ్లకన్న తక్కువ కాలమువరకు ఈరాష్ట్రములో బయటివారు నివాసముచేసిన వారిని రాష్ట్రేతరులుగా భావింతురు. అట్టివారు ఏమైన అపసవ్యపు పనులనుజేసిన వారిని బయటికి గెంటివేయుదురు. హోటళ్ళ యజమానులు రిజిష్టరులుంచి బయటివారు తమవద్ద బసచేసిన ప్రభుత్వమువారికి వెంటనే తెలుపవలెను. అక్రమ సంఘములనుగా ప్రభుత్వమువారు ప్రకటించినట్టి సంఘములలో సభ్యులుగానుండువారికి శిక్షలువేయబడును. బయటివారిని ఆత్మసంరక్షణార్థము ప్రభుత్వానుమతిలేనిది యెవ్వరును నియోగించుకొనకూడదు; ఈవిధముగా అనేకవిధములగు కఠిన నియమములను ప్రభుత్వమువారు శాసించిరి.

మొత్తముపై ఒక్క హైదరాబాదు రాష్ట్రమందే కాక దేశీయ సంస్థానములందంతటను ప్రజా ప్రాథమిక స్వత్వములు ఇంచుమించుగా లేవనియే చెప్పవలసియుండును. పెద్ద పెద్ద దేశీయసంస్థానము లందంతటను ప్రజలు తమకు ప్రాథమిక స్వత్వములు కావలెననియు, తమరాష్ట్రములో బాధ్యతాయుత ప్రభుత్వము వర్తించవలసి యుండుననియు కోరుచువచ్చిరి.



హైద్రాబాదులోని

# ప్రజాధికారాలు

(౧౯౩౮ నుండి ౧౯౫౦ వరకు)

ఇప్పటి నిజాంగారు అత్యంతముగా ఇస్లాంమతాభిమాని అందుచేత ఇతని ప్రభుత్వ కాలమంతయు ముస్లింల యాధిక్యతకు వినియోగింప బడెను, నానాటికితీసి కట్టుగా హిందువుల హక్కులన్నియు సన్నగిల్లెను. ఇతడు ఔరంగజేబు తంత్రమును అవలంభించెను. ఔరంగజేబు అరబీ ఫార్సీలకు సంపూర్ణ ప్రాముఖ్యతమిచ్చెను. ఈ నిజాంగారు ఉర్దూ అరబీ ఫార్సీలకు పోషణ మిచ్చెను. ఔరంగజేబు హిందువుల బళ్ళను మూయించెను. ఇతడు సెలవు లేనిది ప్రైమరీ బళ్ళుకూడా పెట్టగూడదని శాసించెను. ఔరంగజేబు దేవాలయములను రిపేరుకూడా చేయరాదనెను. ఇతడును అట్లే అనెను. ఔరంగజేబు ఇస్లాం ప్రచారము చేయించెను. ఇతడును అట్లేచేసెను. హిందువులలో ముఖ్యముగా హరిజనులను ఇస్లాములో చేర్చుటకు ఇతని మతశాఖగొప్పకృషిచేసెను. బళ్ళలో ఇస్లాంబోధకు ప్రాముఖ్యమిచ్చిరి. హైద్రాబాదునకొక జాతీయగీతికను నిజాంగారే రచించిరి. అతన్ని "అమీరుల్ మోమినీన్" (భక్తుల అమీరు) అని అందు శ్లాఘింప బడెను. భారతదేశమందును అరబిస్థానులోను కల అరబీ ఫార్సీ పాఠశాలలకు లక్షలదానమును

ఏటేట ప్రభుత్వమునుండి యిప్పించెను. ప్రజలకు ప్రభుత్వము సెలవులేనిది సభలుచేయుట కధికారము లేదనెను. ఆసెలవు అష్టదిగ్బంధనముతో కూడినదై అడిగిన ఆరువారాలకు దొరికితే దొరికినట్లు, చాలామారులు దొరకనేలేదు. ప్రజలంటే హిందువులేఅని యర్థము చేసుకోవలెను. ముసల్మానులకు స్వేచ్ఛ సంపూర్ణముగా నుండెను. పత్రికలను స్థాపించుటకు సెలవు దొరుకుట కష్టమైయుండెను. సెలవుదొరికిన పత్రికలు రాజకీయములు చర్చించమని ఒప్పుదల పత్రమువ్రాసి యియ్యవలసి యుండెను. ఆపత్రికలపై పోలీసుశాఖయొక్క అధికారముండెను. నిజామును, నిజాంప్రభుత్వాన్ని తుదకు ముసల్మానులను విమర్శించే బయట పత్రికలను రాష్ట్రములోనికి రాకుండ నిషేధించెడివారు. గట్టిగా మాట్లాడెడి వారిని బయటనుండి లోపలరానీయక లోపలినుండి బయటికి వెళ్ళగొట్టి నానావస్థల పెట్టేవారు తురకల వేషములో నుండిన వారికేమియు ఆటంకములు లేకుండెను. వింతమనిషిని, ఖద్దరు మనిషిని, గాంధీటోపీవానిని చూచిన మండిపడెడివారు. వాడు రైలునుండి దిగగానే గూఢచారులు, పోలీసులు వానివెంటబడి వాని పుట్టుపూర్వోత్తరాలు విచారించి వ్రాసుకొని వాడెవనివద్ద దిగునో అచ్చటికి వారు దినమువెళ్ళి వాని చర్యలను గమనించెడివారు. ౧౯౩౪ వరకు హైద్రాబాదురాజ్యములోని ధనికులు, దొరలు, దేశముఖులు, దేశపాండ్యాలు, జాగీర్దారులు, విద్యావంతులు, తుర్కీటోపీలు పెట్టి షేర్వానీలాగులు ధరించి తిరిగెడివారు. హిందువులు తమమాతృభాషలను సరిగా మాట్లాడక పరస్పరము ఉర్దూలో మాట్లాడెడివారు

ఉద్యోగాలలో నూటికి ౯౦ పాళ్ళు మునల్మానులకే యిచ్చిరి.
నిజాం స్వయముగా ఒకమారు ఇంచుమించు ౩౦ ఏండ్లక్రిందట
ఒక పత్రికలో ఒక ఉర్దూగీతమును వ్రాసెను. దానియర్థమిది.
"మానవాజుధ్వనిచే శంఖము పగిలిపోయెను. మాయత నాదము
[అజాం] వెడలగానే జందెములుపుట్టుకున్నతెగిపోయెను." ఇట్టి
సన్ని వేశములలో దినదినము హిందువుల యొత్తిడి, ఆందో
ళనము, ఎక్కువయ్యెను. ౧౯౩౫ లో ఇంగ్లీషువారు కొంత
సహింపదగినట్టి రాజ్యాంగ సంస్కరణములను ప్రసాదించిరి.
హాయిదాబాదులోను అట్టివి కావలెనని హిందువు లాందో
ళనము చేసిరి. హాయిదాబాదుప్రజాపరిషత్తునుస్థాపించి అందు
"నెహ్రూనివేదిక" వంటిదొక రాజ్యాంగ ప్రణాళికను సిద్ధము
చేసిరి. ఇట్టి యాందోళనము నరికట్టుటకై ప్రభుత్వపు చల్లని
చూపులో నిజాంగారి ఆశీర్వాదముతో "ఇత్తెహాదుల్ మున
ల్మీన్" అను నొక సంస్థను మునల్మానులు స్థాపించిరి. ఇది
ఇంచుమించు ౧౯౩౨లో స్థాపితమైనది. దానికి నవాబ్ బహద్దర్
యార జంగ్ అనునతడు నాయకుడయ్యెను. ఆనాటినుండి హాయి
దాబాదు రాజకీయ చరిత్ర యంతయు ఇత్తెహాదీ చరిత్రయే
యనవలెను. ౧౯౩౯ లో పలువురు హిందువులు సత్యాగ్రహ
మును ప్రారంభించిరి. అది తొందరపాటుతో చేసినదే. దేశము
దానికేమాత్రమున్నూ సిద్ధమై యుండలేదు. దానిని ప్రభుత్వము
అవలీలగా రెండుమాసములలో అణచివేసిరి. అప్పుడు గాంధీ
మహాత్ముడు ఉద్యమాన్ని ఆపివేయించి బంధితులను విడిపిం
చెను. ఆయుద్యమములోపాటు ఆర్యసమాజమువారు యాజ

ద్భారతదేశమునుండి వేలకొలది జట్టులను హాయిద్రాబాదుకంపి జైళ్ళను నింపిరి. వీటి ఫలితమేమన ఇత్తెహాదువారు మరింత విజృంభించిరి. వారు విశృంఖలముగా ఆచరించిరి, భాషించిరి. ఆందోళనములు, చేసిరి. అంతలో బహద్దరుయార జంగు అకస్మాత్తుగా చచ్చెను. నిజాంగారు స్వయముగావెళ్లి శవమును దర్శించుకొని బేగం బహద్దరుయార్జంగును పరామర్శించితన దుఃఖమును వెల్లడించిరి. అటుతర్వాత ఇంచుమించు రెండుమాసములవరకు స్వయముగా ఒకఉర్దూపత్రికలో ఇత్తెహాదు భవిష్యత్తునుగూర్చి చర్చించి ఇత్తెహాదుకు తగినసలహాలిచ్చుతూవచ్చెను. అన్నిటికన్న విచిత్రమైనదేమనగా బహాద్దరుఖాను బదికియుండగానే నిజాం ఇత్తెహాదువారికొక ప్రమాణపత్రము(తయఖ్ఖునాత్) వ్రాసియిచ్చెను. దానిద్వారా ముందేవిధమగు ప్రజాప్రతినిధ్యశాసనసభ యేర్పడినను అందు ముసల్మాను సభ్యులసంఖ్యయే యెక్కువగానుండుననీ ఒప్పుదలపత్రము వ్రాసియిచ్చెను. దానిని రహస్యముగా ౮ ఏండ్లపాటుంచిరి. అంతకన్న ఎక్కువకాలముంచుకొనలేక పోయిరి. భారతదేశానికి స్వరాజ్యమువచ్చినతర్వాత సర్ మీర్జా కాలములో హిందువులకేమైన ఎక్కువ శాసనసభ్యత్వస్థానాలిత్తురేమోఅని భయపడి "మాకు మాప్రభువుయిచ్చిన రహస్యవాగ్దానపత్ర మిదుగోచూడండి" అని ప్రకటించిరి. ఈవిధముగా నిజాం ప్రత్యక్షముగా పరోక్షముగా హిందువులకు వ్యతిరేకముగాను ముసల్మానుల కనుకూలముగాను వర్తించుకొని నిరంకుశపరిపాలనము ౩౫ ఏండ్లు చేసెను.

అంతలో ఖాసింరజ్వీఅనే ఒకసాధారణ జిల్లావకీలు తటా లున ఇత్తెహాదురంగముపై కెక్కెను. హిట్లరెట్లు వెలిగెనో. ముసోలోనీ యెట్లుయెగిరెనో, అదేవిధముగా 3 ఏండ్లపాటు ఖాసీంరజ్వీ హైదరాబాదు రాజకీయరంగమందేకాక హిందూ స్థాన రంగమందు మారుమోగిపోయెను. రజాకారు ఉద్య మాన్ని లేవదీసెను. మిలిటరీ, పోలీసు, రజాకారు, చేతులు కలిపిరి. వీరుచేసిన దోపిడీలు, చేసినఖూనీలు, చేసినదహనాలు, చేసిన మానభంగములు, అన్నియు హైదరాబాదుచరిత్రకెక్కి నవి. వీరు "ఆతతాయునులు" అని పించుకొనిరి. వీరి చేత

ఛత్తారీమంత్రి దెబ్బలుతిని బ్రతుకుజీవుడాఅని పారిపోయెను. సర్ మీర్జా ఇస్మాయిల్ వచ్చిన ఏడాదిలోపలనే చల్లగా బెంగు ళూరు చేరుకొని ఇక హైదరాబాదు కిక్కడినుండియే "నావీడ్కోలు సలాము"అని ఒకసలాము పంపెను.మరల సిగ్గు లేని అ ఛత్తారీనవాబే రెండవమారు మంత్రియై, మరల శరీర శాస్త్రి అన్యోన్యసమయములో చచ్చి చెడి చేయంగల విన్నప ములనుచేసి హైదరాబాదుకు శాశ్వతముగా "అల్విదా" (వీడ్కోలు) మనవిచేసుకొని వెళ్ళిపోయెను. ఇత్తెహాదువారి ముఖ్యసిద్ధాంతాలేవనగా

౧. ఈదక్కన్ దేశాన్ని తురకలు కత్తితోగెలిచినారు. కాన వారికి దాన్నిపాలించే అధికారము సర్వదాకలదు.

[౨] తురకలకు ఏవృత్తియు మిగులలేదు. కాన సర్కారి ఉద్యోగవృత్తి వారికి జన్మతోనేవచ్చిన హక్కు.

[౩] తురకలను వారి ఘనతనుబట్టి తూచవలెనేకాని వారి సంఖ్యను లెక్క పెట్టరాదు.

[౪] తురకలీదేశములో (ఆఖాలు) యజమానులు హిందువులు గులాములు(ఇత్తెహాదు కార్యదర్శి అబ్దుర్రాఫ్ అభిభాషణములు)

[౫] ఉర్దూ విశిష్టభాష.అదియేసర్వత్రా ప్రచారమందుండవలెను.

[౬] రాజ్యాంగములో ముస్లిముఆధిక్యతఉండవలెను. ఎందుకన హైదరాబాదు రాజ్యం "ఇస్లామీరాజ్యము"

చిత్రమేమనగా మంత్రిగానుండిన సర్ అక్బర్ హైదరీయు నిజాంగారున్నూ పై సిద్ధాంతాలను ౧౯౩౯ లో ఒక విచిత్ర రాజ్యాంగమును ప్రసాదించువేళ ఒప్పుకొనిరి.నిజాం తన ఫర్మానులో "ఇది ఇస్లామీరాజ్యం" అని ఇత్తెహాదువారి తృప్తికై స్పష్టముగా పేర్కొనెను.

ఈవిధముగా నిజాంగారు తనఇస్లాం పక్షపాతముతో, అట్టి పక్షపాతముగల మంత్రులసహాయముతో హిందువులకు అపారమగు నష్టములను కలిగించెను. తుదకు పాపంపండెను. పోలీసుచర్యఅయ్యెను. ౩౫ ఏండ్లనుండి నిర్మించుకొంటువచ్చిన "ఇస్లామీమతరాజ్యపు ఆకాశహార్మ్యము నాలుగేదినాలలో కూలి మాయమయ్యెను.

ఇంతదూరము చెప్పుట యెందుకన హైదరాబాదు రాజ్యములోఎన్నడునూ ప్రజలకధికారా లావంతయు లేకుండెనని తెలుపుటయే కాక ఇప్పటి నిజాంగారియొక్క దీర్ఘకాల

పాలనములో పూర్వమెన్నడును లేని కష్టాలను హిందువులనుభవింపవలసివచ్చెనని నిరూపించుటకే! అనగా ప్రజాధికారములు సంపూర్ణముగా శూన్యమయ్యెను.

పోలీసుచర్య ౧౯౪౮ సెప్టెంబరు ౧౩నాడు మొదలై ౧౭ నాడు ముగిసెను. నాటినుండి యీ ౨౦ నెలల కాలములో హైదరాబాదులోని ప్రజలకు ఎన్నడును సంస్థానచరిత్రలో లేని అధికారాలన్నియు సమకూరెను. ఇప్పుడు సభలు సమావేశములు చేసికొనుటలో ఆటంకాలు లేవు. ఉర్దూనిర్బంధ మెగిరిపోయినది. కచ్చేరీలలో జిల్లాభాషలో ఇంగ్లీషులో కూడా వ్యవహారాలు జరుగుచున్నవి. బళ్ళలో మెట్రికువరకు మాతృభాషలలో విద్య చెప్పించుతున్నారు. కళాశాలలలో వాటి కర్స్థాన మిచ్చుచున్నారు. మతపక్షపాతాలేమియు లేవు. జాగీర్దారుల దౌర్జన్యాలు వారి సంస్థానాలతో పాటు రూపుమాసెను. అంటరానితనము పూర్తిగా తొలగింపబడెను. హైదరాబాదు భారతదేశములోని అంగముగా లీనమయ్యెను. అక్కడి శాసనములన్నియు హైదరాబాదుకు వర్తించు ఏర్పాటయ్యెను. సర్ఫెఖాసు ఖాల్సా అయ్యెను. నిజాంగారికి ౫౦ లక్షల భృతి నిర్ణయమయ్యెను. ప్రజాభిప్రాయప్రకారము ఇకముందు శాసనసభ

శేర్పడుటకై ఏర్పాటులు కావింపబడినవి. వ్యవసాయశాసనములలో చాలామార్పులగుచున్నవి. ఇంకను ఎన్నోమార్పులు జరిగినవి. ఇది సంధికాలము.అన్నియు ప్రజలనుకొన్నట్లు కాలేదు. అది యసంతృప్తికి కారణము కాజాలదు. ముఖ్యసిద్ధాంతములంగీకరింపబడినతర్వాత అవి కార్యరూపముదాల్చుటకు కొంత కాలముపట్టును.



# ప్రజాధికారములపై నిరోధములు

మానవులకు స్వాతంత్ర్యము జన్మతో వచ్చిన అధికారమని పలువురన్నారు. మానవులకు తమ యిష్టము వచ్చిన రీతిగా తమ దేశపరిపాలనము సాగింపజేయు అధికారమున్న దని ఇప్పుడు బహుదేశము లంగీకరించినవి. ఇంచు మించు క్రీస్తు శకారంభము నుండి అమెరికా స్వాతంత్ర్యము వరకు (౪ జూలై ౧౭౭౬ వరకు) రాజులు తమకు ప్రజాపరిపాలనాధికారము నను ఈశ్వరుడే ప్రసాదించె ననియు "నావిష్ణుః పృథివీ పతిః" అనియు కూలిపండితులచే వర్ణింపజేసిరి. ఇప్పుడు "నావిష్ణుఃపృథివీ ప్రజాః" అనిశాస్త్రమును త్రిప్పి వ్రాయవలసి వచ్చినది. తామస్ పెయిన్ అను అమెరికా పౌరుడు "ప్రజల అధికారాలు" అను పుస్తకమును వ్రాసెను. అందతడు ప్రజాపాలనము కల అమెరికా విధానమును సర్వవిధాలా సమర్థించి ఇంగ్లండు లోని రాజరికమునుతీవ్రముగాఖండించెను. ఆనాటినుండి బహు దేశములలో, ప్రజాభ్యుదయమునకు త్యాగములు చేసిన మహాత్ములు బహుగ్రంథములను వ్రాయుచు వచ్చిరి. అట్టి మహాత్ములందరును మానవ లోకాన కంతటికిని పూజ్యులై యు

న్నారు. మానవుల హక్కులకై ప్రపంచ మంతటను మహాత్ములు ఆత్మ బలిదానములు చేసినను ఏదోవిధముగా మానవుల హక్కులకు భంగములుకలుగుచునే యున్నవి. మానవాధికారాలను గురించి చదువువారు భూలోకమందిక అంతయు నందనవనమే యుండునని భ్రమపడరాదు. ఆభ్రమను తొలగించుటకై ఈ ప్రకరణమందు సంగ్రహముగా కొన్ని విషయములను ఎత్తిచూపుచున్నాము. ఫ్రెంచి స్వాతంత్ర్యమునకు ముఖ్యకారకుడైన జీన్ జాక్వెస్ రూసో అనునతడు ఎమిలి అను తన గ్రంథమందు "మానవుడుస్వతంత్రుడుగానే పుట్టును కాని సర్వత్రవాడు సంకెళ్ళలో తగుల్కొనినాడు" అనివ్రాసెను. అబ్రహాంలింకన్ ౧౮౬౩ లో గెటిస్ బర్గులోని యుపన్యాసములో నిట్లనెను. "ప్రజారాజ్యమంటే ప్రజలయొక్కయు ప్రజలచేతను, ప్రజలకొరకును సాగునట్టిప్రభుత్వము" ౧౮ వ శతాబ్దపు ఔపయోగిక సిద్ధాంతమును లేవదీసిన జెరిమీ బెంథాం అను ఇంగ్లీషువాడిట్లనెను. "అధిక సంఖ్యాకుల అత్యధిక సౌఖ్యానికి పాటుపడేదే ఉత్తమ ప్రభుత్వము."

ఈ విధముగా పలువురు తమకు తోచిన సిద్ధాంతములను వెల్లడించిరి. ఎన్ని చెప్పినను మానవుల అధికారాలపై ప్రతి దేశమందును కొన్ని అవసరమైనవి, కొన్ని అనవసరమైనవియునగు నిరోధములు కల్పింపబడినవని యొప్పుకోవలెను. పదారణాలా న్యాయము ధర్మము ప్రజారాజ్యములలో సాగుతుందనుట అబద్ధము అనేకప్రజారాజ్యాలలో పార్టీప్రభుత్వాలు కలవు. ఏపార్టీ అధికార స్థానములో నుండునో అది తనస్థిర

త్వాన్ని ప్రయత్నింపవచ్చును. ప్రతిపక్షులపై పరోక్షముగా కొంత అన్యాయమును చూపవచ్చును. మరికొన్ని దేశాలలో ప్రజారాజ్యము పేరుతో ప్రజానుమతితో రాజ్యాధికారమును పొందినవారు నియంతలై ప్రజల అధికారాలకు పెద్దసున్న చుట్టినారు. హిట్లర్, ముసలోనీ, అట్టివారై యుండిరి. ఇప్పుడు రష్యాలో స్టాలిన్ అట్టి నియంతయై నిరంకుశ చక్రవర్తి స్థానమునాక్రమించుకొని తిష్ఠవేసినాడు. అందుచేతనే నిరంతరజాగ్రతిగా స్వాతంత్ర్య దక్షిణ స్వాతంత్ర్యమును నిలుపుకొన వలెనని "నిరంతరము మెలకువతో" నుండవలెను అని రాజకీయ వేత్తలు తెలిపినారు.

ప్రపంచాన్ని అనాదినుండియు ఒక రాజరికమే కాక మతముకూడా బాధించుచూ వచ్చినది. కొంతకాలము మత గురువులే రాజులను శాసించిరి. క్రమక్రమముగా రాజులు సైన్యయుక్తులు కావున పైచేయివారైరి. అయినను మతసంస్థలు సాగించిన దౌష్ట్యములు మహాభయంకరములు. క్రైస్తవుల "ఇంక్విజిషన్" అను షడ్యంత్రచిత్రవధలను, ముసల్మానుల మతయుద్ధాలు, కాఫిర్ల హింసాదికములు, హిందువుల చాతుర్వర్ణ్య ఘోరాలు, అమాయక జనులవద్ద ద్రవ్యముల లాగి వారికి పుణ్యలోకాల లోనికి టికెటిచ్చి శవము వెంట పూడ్చినట్లు చేయుటలు గారడీలచే మూర్ఖులను మోసగించుటలు. మతము పేరుతో మద్యమాంస భోజనము, వ్యభిచారము, వామాచారములు కావించుటలు, ఇట్టివన్నియు ప్రపంచమెరిగియేయున్నది. తక్కిన దేశముల యుదంతములట్లుండ హిం

దువులలోని వర్ణవ్యవస్థ హిందువుల నెంత నాశనము చేయ వలెనో అంతచేసియే తీరెను. ఏమహాత్ముల తపశ్శక్తివల్లనో మనకెటులో స్వాతంత్ర్యమబ్బినది. దానిని గట్టిగా నిలబెట్టు కొనవలెనంటే కులభేదములంతరించ వలెను. అంటరాని తనము సమూలముగా నాశనము కావలెను. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు తాముజన్మముచేతనే గొప్పవారమనుకొనుట, జన్మ చేతనే తమకు కొన్ని అధికారములు ఋషులకాలము నుండి అవిచ్ఛిన్నముగా తమకు వారసత్వ రూపములో సంక్రమిం చుతూ వచ్చినవనుకొనుట, శూద్రులకు అధికారాలే లేవని మనుస్మృతి మొదలుకొని అన్ని స్మృతులలోను వ్రాయుట, చాలాఘోరము. ప్రపంచ మంతటను మానవులకు సమానాధి కారాలున్నవని ప్రకటించగా మన సనాతనాచార రతులు శూద్రులకు "నేతి,నేతి, నహి,నహి" ఇదిలేదు అదిలేదు సర్వం లేదు, నీకు పైవారితో సమానముగాకూర్చును అధికారము లేదు. వేదమువిను అధికారములేదు మరి ఉచ్చరించితివా నాలుకకోస్తాము, నీకుద్రవ్యసంపాదనాధికారము లేదు, సంపాదిం తివా అది బ్రాహ్మణులకు చెందును అని వెర్రిమొర్రి శాస్త్రాలు వ్రాసిరి. ఆభావాలన్నియు వెంటనే హిందువులు వదలుకొన కున్న జాగృతిపొందిన బహుళ శూద్రజాతివలన సంఘానికి ముప్పు కలుగవచ్చును. "వారసత్వపు అధికారాలన్నియు దౌర్జన్యాలకు దారితీయును.రాజులు మానవులను గొర్లమందల వలె వారసత్వముచే పరిపాలించు అధికారముపొందిరి. ప్రభు త్వోద్యోగాలు వారసత్వముగానంక్రమించిన ఎటుసాగును?ఒక

రాజుకు ఏపదవి యిచ్చునది ప్రజల కేవదలిన బహుశా వారు వానికి చ ప్రా సీ పదికూడా ఇయ్యరేమో" అని తామస్ పెయిన్ "మానవాధికారములు"అను గ్రంథములో వ్రాసెను. అటులే కులములందును వారసత్వముగా పుట్టుకతోనే ఉచ్ఛనైచ్యత లేర్పడినవని చెప్పు దుష్టసిద్ధాంతములన్నియు అబద్ధములు. పిచ్చిమాటలు.

మతసాంప్రదాయముల గుత్తాదారులు మానవులనుమత విషయములలో స్వతంత్రముగా ఆలోచింపనీయరు. తమ మత గ్రంథాలలో భావాలకు విరుద్ధముగా ఏ మేధస్సంపన్నుడైనను పలికినవాన్ని తిట్టి, బంధించి బాధించి కాని వ ద ల రు. ఇట్టి స్వాతంత్ర్యపరిమితిలో మనమున్నాము.

కొన్ని నిరోధములు న్యాయమైనవే. తనకు స్వాతంత్ర్య మున్నదికదాయని సత్యమేమైనను ఇతరులకు మానభంగము, అవమానము, ఆర్థికాధినష్టములు,కలిగించునవి ప్రకటించరాదు. మనప్రాచీనులుకూడా ఇదేవిషయము నిట్లు తెలిపినారు.

"సత్యంబ్రూయత్, ప్రియంబ్రూయత్
నబ్రూయాత్ సత్యమప్రియం"

"సత్యముచెప్పుము, ప్రియమైనవేచెప్పుము. అప్రియ మైన సత్యమును చెప్పవద్దు" అని బోధించినారు.

ఏదేశములో జనులున్నారో ఆదేశ ప్రభుత్వాచర్యలు వారికి నచ్చకుండిః వక్రమాందోళనముచేసి ప్రజాభిప్రాయము

పొంది తాము అధికసంఖ్యాకులలో శాసనసభ్యులై ప్రభుత్వ సంచాలకులగుట సరియగుపద్ధతి. అట్లుచేయక కుట్రలుపన్ని ద్రోహముచేసి విప్లవములేవదీసి హింసాత్మకమగు అల్లరులు చేయుట తప్పగును. అట్టివారికి దేశద్రోహాపరాధశిక్ష కావింపబడును.

నాయిష్టమువచ్చినట్లు చేస్తానుఅని యెవ్వరికిని అనే అధికారములేదు. సంఘమర్యాదలకు కట్టుబడవలసివచ్చును. నేను జీవన్ముక్తుడను అని ఎవ్వడైన దిగంబరుడై వీధులలో తిరిగిన అతడుపిచ్చివాడని ఉన్మాదాలయమునకైనా పంపుదురు. పిచ్చి లేకున్న నిర్బంధములోనైనా ఉంతురు. సంఘమున కపకారకరమును ప్రజారోగ్యమునకు భంగకరమును ప్రజల కపాయకరములును నగువానిని, ఎవ్వరునూచేయుట కధికారము కలిగియుండరు. నీతిబాహ్యమైన పనులనుచేయుటకు కాని, బూతువాఙ్మయమును ప్రకటించుటకు కాని ప్రజలకధికారములేదు.

వాక్స్వాతంత్ర్యము ప్రజాధికారములలో ముఖ్యమైనదంటిమి. కాని దానికి పరిమితి(చెక్బందీ) కలదు. సైన్యము వద్దకుపోయి "వీరసోదరులారా! వినుడు, అహింసా పరమోధర్మః మీరు పరదేశములపై యుద్ధానికి వెళ్ళుచున్నారు. ఆ దేశ సైనికులకు మీకును ఎన్నడుకూడా తగవులు లేవుకదా! వారిమొగాలైనా మీరెన్నడును చూడలేదుకదా! వారిదేశము పేరుకూడా మీరు వినియుండలేదే! అట్టివారిపైకి మీరువెళ్ళుటేమి, వారినిచంపుటయు, మీరుచచ్చుటయు, ఈ మారణకర్మ మెందుకు చేయుచున్నారు. ఇవి అమానుషము. మీరు తుపా

కులు పారవేయండి.'' అని చిన్న యుపన్యాసముచేసి ఫలితము చూడండి. సేసాని అక్కడనే నిన్ను తుపాకితో కాల్చకున్న నీకు బహుసంవత్సరాల జెయిలుమాత్రము తప్పదు. ప్రజలను ఉద్రేకోపన్యాసములిచ్చి రెచ్చగొట్టు వాగ్ధాటీ పరిపాటిగల నాయకులుకొందరుప్రతిదేశమందును కలరు.వారిపైప్రభుత్వాని కొంక కన్నెప్పుడును ఉండును. ఏదైన అసాధారణపరిస్థితి దేశ మందేర్పడినప్పుడు అట్టి వాగే వాగీశులను గప్ చుప్ గాబంధించి జెయిలులో మూసియుంతురు. ౨౬ నవంబర్ ౧౯౪౯లో మన భారత రాజ్యాంగము శాసనరూపముదాల్చెను. ఈ ౫ నెలలలో ఎందరిని విచారణలేకుండా మూసివేసిరో దినపత్రికలు చదివే వారికి విదితమేగదా!

వినోదములుచూచే విషయమందును ప్రజలకు సంపూ ర్ణాధికారాలులేవు. మాదేశములోనున్నంత ప్రజాస్వేచ్ఛ మరెం దైనా కలదాయని ప్రగల్భించుఇంగ్లీషువారు రష్యాలో ప్రసిద్ధ మైన గోర్కీరచనయగు మదర్(అమ్మ) అనే కథను, ఇంగ్లీషు వారి సామ్రాజ్యఘోరాలను తెలుపు ఏషియాపై తుపాను అను కథను, ఫిల్ముగా సిద్ధముచేసిపంపగా వాటిని ఇంగ్లండులో ప్రద ర్శింపరాదని తిరుగగొట్టిరి. స్వదేశిదికాని విదేశిదికాని ప్రతిఫిల్ము, ప్రతిటాకీ, ''సెన్సారు'' కానిది ప్రభుత్వానుమతి పొందనిది ప్రదర్శింపనీయరు. అనగా మనయిష్టము ప్రభుత్వయిష్టమని కాదు. ప్రభుత్వపు ఇష్టమే మన యిష్టమైయుండవలెనన్న మాట! మంచివంకాయలు ఎట్లుపండును, కప్పలెట్లెదుగును, పంటలలో మొదటిబహుమానాలుపొందిన వెట్లుండును, అన్న

ఫిల్ములు స్వేచ్ఛగా చూడండి అనియందురు కాని బ్రిటిషు సామ్రాజ్యమెట్లు వృద్ధియయ్యెను అనుదానిని ప్రదర్శించిన వెంటనే పోలీసువారు ఆఫిల్ముపై బూటుకాలునుంతురు.

ప్రభుత్వశాసనాలలో నేవైనా ప్రజలకిష్టములేనివైన కొందరు ఆక్షేపణ తెలుపుటకై ఊరేగింపులు తీయుదురు. అది ప్రభుత్వానికి నచ్చదు. ఊరేగింపుమూలాన ప్రజలకిబ్బందులు కలగించుటకు, అల్లరులు జరుగుటకు. అవకాశాలున్నవి అని పోలీసువారు లాఠీలతో చుట్టుకొందురు. కొన్ని సమయములలో నాయకులను ముందుగానే పట్టుకొందురు, ఊరేగింపు కాకమునుపే దానిపై ఆంక్షపెట్టుదురు, అక్కడికినీ వినకున్న తుపాకులనే కాల్చి నిరోధింతురు. అట్టిసమయాలలో నాయకులను నిర్బంధింతురు. లేదా వారిని కోర్టులోపలబెట్టి "మేము ఒకనిర్ణీత కాలమువరకు బుద్ధిమంతులమై యుందుము" అని జమానతులిప్పించి వదలివేయుదురు.

ప్రతి ప్రభుత్వానికి చారులు (సి. ఐ. డీలు-ఖుఫ్యాలు) ఉందురు. స్వాతంత్ర్యప్రియత్వప్రదర్శనమందు పట్టరానిఉత్సాహములను ప్రకటించువారివెంట వారుందురు. వారి రాత్రింబగళ్ళ చర్చలన్నియు తమకవిలె కెక్కించు చుందురు. అనగా జనుల స్వేచ్ఛలో భంగము కలిగినది.

ప్రజలనుండి చందాలు వసూలు చేసి కొందరు ప్రజామందిరముల నిర్మింతురు. సభలు చేసికొన దలచినవారట్టి మందిరములను విచారించుకొను సమితిని ఆశ్రయించి సెలవుపొం

దుదురు. కాని పలుమారు సమితికి సభోద్దేశములు నచ్చక పోతే ప్రజామందిరములలో సభలను కానియ్యరు. ప్రభుత్వము ముందుగానె సరిపడని సభలకు అనుమతిలేదని నిరోధించును. అంతటితో వ్యవహారమాగదు. పోలీసువారు అందరికన్న ముందుగా సభ జరుగనున్న స్థలమునకుపోయి దానిని మూసివేసి తాళము వేసి దానిచుట్టు కావలికాచి వచ్చినవారిని బెదిరించి తిరుగ గొట్టుదురు. కొన్ని సందర్భాలలో పోలీసులు అనుమాన గ్రస్తులైన వారియిండ్లలోదూరి అంతయు తలక్రిందుగా జేసి తమకు వింతగా కనబడిన దంతయు జప్తీచేసి తీసుకొనిపోదురు. విచారణ లేకుండ నిర్బంధితులగు వారికి సుప్రీం కోర్టులోకాని హైకోర్టులోకాని (హేబియస్ కార్పస్) వ్యక్తి స్వాతంత్ర్యమును కాపాడుడు అని వ్యవహరించుటకు రాజ్యాంగమందును న్యాయసూత్రములందును అధికారమిచ్చినారు. భారతదేశము ఇంగ్లీషువారి అధీనములో నున్నంత కాలము నూర్లకొలది వేలకొలది రాజకీయ నిర్బంధితులు విచారణలేక హైకోర్టుల పరామర్శ, న్యాయశీలత లేక, జైళ్ళలో ఏండ్లకొలది మగ్గిరి. ౨౬ నవంబరు ౧౯౪౯ నాటి స్వాతంత్ర్యభారతీయ రాజ్యాంగము తర్వాత ౫ నెలలోనే పలువురి హిందూనాయకులను విచారణ లేకుండ నిర్బంధించిరి. వారికై బొంబాయి హైకోర్టులో హేబియస్ కార్పస్ క్రింద మొరపెట్టుకొనగా ఏప్రెల్ ౧౯౫౦ లో వారిని కోర్టులో విచారించుట కంగీకరించిరి. కాని ముందేమి నిర్ణయ మగునో తెలియదు.

గినవారిని విచారణలేక నిర్బంధించిరి. జనులను బలవంతముగా సైన్యములో వారి అర్హతకు తగినట్లు కత్తి పట్టుటో, కలము పట్టుటో, మూటలు మోయుటో, పీనుగుల మోయుటో, మోటార్లతోలుటో, ఏదోయొకపని నిర్బంధముగా చేయవలసియుండెను. చేయుటకు నిరాకరించిన జెయిళ్ళలో వేసిరి. యుద్ధకాలములో ప్రతివిషయముకూడ నిర్బంధముతో కూడినదిగా నుండును. కాన అవి అసాధారణ పరిస్థితులు.

ఈవిధముగా మానవుని స్వాతంత్ర్యముపై నిరోధములుండుటనుగూడ మనము గమనింపవలెను. అందు న్యాయమైనవేవి అన్యాయమైనవేవి అని ప్రజలు తెలుసుకొని అధిక సంఖ్యాభిప్రాయ ప్రకారము అవసరమైతే ప్రతిఘటింపవలసి వచ్చును.

మరొకవిషయమును మనము జ్ఞాపకముంచుకొనవలెను. అమెరికాలో ౧౭౯౧లో తామస్ పెయిన్ మానవాధికారాలు అనుగ్రంథమువ్రాయగా దానికిప్రతిగా౧౮౫౭ లో (ఇండియా విప్లవము భగ్నమై మనముపూర్తిగా దాసులమైన సంవత్సరమున) ఇటలి ముక్తిదాతయగు మాజ్జినీ మానవవిధులు అను గ్రంథమును ప్రకటించెను. ప్రతిపౌరుడును నాఅధికారాలు నా అధికారాలు అని నినదించిన విధులగతి యేమికావలెను. విధులకు ప్రాముఖ్యములేని అధికారాలు అపాయకరముగా పరిణమించును, ప్రతిమానవుడును "లోకసంగ్రహము" నకు పాటుపడవలెను. అని ఆగ్రంథమందు మాజ్జినీ బోధించెను. (మాజ్జినీ భగవద్గీత చూచియుండును.) అదే మానవవిధులలో హిందు

వులచాతుర్వర్ణ్యవ్యవస్థను ఖండించి యిట్లనెను "ఎంతవరకీ శిరో బాహూరు పాదోత్పత్తి సిద్ధాంతము బలీయముగానుండునో అంతవరకాసంఘము స్థాణురుర్భవ(వృద్ధిలేక ఉన్నచోటులనే యుండుము) అని తననుతానే శపించుకొన్నదగును అని అనెను. క్రీ. శ. ౧౭౮౦నుండి యూరోపులో సంస్కృతవాఙ్మయం, ఉపనిషత్తులు, భగవద్గీత వివిధభాషలలో వ్యాపించి యూరోపు అమెరికాలలోని మేధస్సంపన్నులపై అపారప్రభావము కలదయ్యెను. షెలిసర్; వాల్టేర్, గెటే. హంబోల్టు, కార్లయిల్, ఎమర్సన్ అనువారిని ఇతరపాశ్చాత్యవిద్వాంసులను ఆకర్షించెను. కావున మార్క్సునీపై భగవద్గీతయొక్క ప్రభావములు మానవ విధులలో వ్యక్తమగుచున్నది.

కర్మణ్యేవాధికారస్తే
మా ఫలేషు కదాచన

ఇత్యాది భావాలు అందుకలవు. "విధులయొక్క ఆజ్ఞలను నెరవేర్చునంతవరకు నీకుఅధికారములు సంక్రమింపజాలవు" అని యనెను. మానవవిధులు— దేవునియెడ, ధర్మమునెడ, మానవత్వమునెడ, దేశమునెడ, కుటుంబమునెడ, ఆత్మమునెడ, స్వాతంత్ర్యమునెడ, విద్యయెడ, సంఘమునెడ, ఏయేవిధముగా నుండునో అవన్నియు చాలావిపులముగా నా గ్రంథమందు నిరూపించినాడు.

మనకు స్వరాజ్యము వచ్చి రెండేండ్లయ్యెను. కాని అంతలోనే మనకేమి లాభించినదయ్యా? అని జనులు విమర్శింప

మొదలు పెట్టినారు. జనులు స్వరాజ్యము వచ్చినవెంటనే తమకు కష్టాలుండవనియు, తమకు రెండంతల లాభాలుండునవనియు, ఏమేమో గొంతెమ్మ కోరికలతో నిండి పోయినారు. "ప్రజలనుండి మేము అధికారము పొందినాము" అని ప్రభుత్వమువారు భారతీయరాజ్యాంగములో మొట్టమొదటనే అన్నారు. కావున ప్రభుత్వమును తప్పుపట్టుటఅంటే మనలనే తప్పు పట్టుకొనుట యగును. అట్టివారికి మార్క్సనీగారి మానవ విధులు అను గ్రంథము సరియగు సహాయము చేయును.

తోడి మానవుల నిష్కామ సేవయే స్వాతంత్ర్యమును నిలబెట్టుకొనుటకు రాజమార్గము అని యాగ్రంథము నిరూపించినది.

"ఈశావాస్య మిదంసర్వం
యత్కించ జగత్యాంజగత్
తేనత్యక్తే నభుంజీథా
మాగృధః కస్యస్విద్ధనం"
"కుర్వన్నే వేహకర్మాణి
జిజీవిషేత్ శతంసమాః"

—(ఈశావాస్య)

——♦——

